# ప్రపంచ సమస్యలు: రష్యా వైఖరి

## బ్రిటిష్ ప్రాతికూల్యం

### ఐక్యరాజ్యసమితిలో మెక్నైల్ ప్రసంగం

ఫ్లషింగ్ మెడోస్ (న్యూయార్క్), సెప్టెంబరు 22: ప్రపంచ వ్యవహారాల పట్ల సోవియట్ యూనియన్ ప్రదర్శిస్తున్న వైఖరిలో ప్రతిఅంశంతోనూ బ్రిటన్ ఏకీభవించదని బ్రిటిషు స్వదేశమంత్రి హెక్టర్ మెక్నీల్ ఈవేళ ఐక్యరాజ్య సమితి సమావేశంలో స్పష్టంచేశాడు.

## తాత్కాలిక శాంతిసంఘం

శాంతి భద్రతలను ఆలోచించేందుకు ఒక తాత్కాలికసంఘాన్ని నియమించాలని అమెరికా చేసిన ప్రతిపాదనను అంతా శ్రద్ధగా ఆలోచించాలని మెక్నీల్ విజ్ఞప్తి చేశాడు. ఈ ప్రతిపాదనవల్ల భద్రతా సంఘం తోసిరాజవుతుందని రష్యా విదేశాంగ సహాయమంత్రి విషిన్స్కీ ఈప్రతిపాదనను ఇంతకుముందు ఖండించాడు.

## కొరియా సమస్య

"కొరియా సమస్యను ఐక్యరాజ్యసమితిలో ప్రతిపాదించినందుకు సోవియట్ ప్రతినిధి విషిన్స్కీ అమెరికాను విమర్శించాడు. కాని అతడే భద్రతా సంఘంలో ఈజిప్టు బ్రిటన్‌మీద తెచ్చిన ఫిర్యాదును సమర్థించాడు. యుద్ధాన్ని వాంఛిస్తున్నారని రష్యా అందరిమీదా ఆరోపించటం అసంబద్ధంగా వున్నది. నిజానికి సర్వస్వతంత్ర ప్రతిపత్తి, వినయమై రష్యాకు ఉన్న అభిప్రాయం మాకు ప్రమాదశంకను కలగజేస్తున్నది. ఐక్యరాజ్యసమితి సంఘాలతో సహాయ నిరాకరణంచేస్తూ కొంపమాపన చేయటంవల్ల రష్యన్ ప్రతినిధులు కాలయాపనకై వీటోను ఉపయోగిస్తున్నారు. ప్రపంచ అభిప్రాయాలన్నిటికీ తావు ఇచ్చేటందుకై ఐక్యరాజ్యసమితికి చెందిన వివిధ అంగాలలోనూ ప్రాతినిధ్య స్వీకారాలు అన్నిదేశాలకూ అన్వయింప చేయాలి. కాని దీనివల్ల సమితిప్రణాళిక సూత్రాలకు భిన్నంగా జరగటంకాని, సమితి అనుబంధసంస్థల ప్రతిపత్తికి భంగం కలగటంకాని జరగకూడదు.

## పరమాణు కంట్రోలు

పరమాణు శక్తిని కంట్రోలు చేసే విషయంలో సోవియట్ ప్రతినిధులు చేసిన ప్రతిపాదనలను నేను అంగీకరించను. ఆ ప్రతిపాదనలవల్ల మనం కోరుతూ వున్న భద్రతలభ్యంకాదు. కాని ఈవిషయంలో సమితి ఆమోదించిన విధానం, ఆ యుద్ధ విధ్వంసకు ప్రపంచంలో జరిగిన ప్రయత్నాలన్నిటిలోనూ అత్యుత్తమమైనది. దీనికి రష్యా ప్రతినిధి వ్యతిరేకంచేస్తున్నట్లయితే, రష్యాకు ఒక్కదానికే కాకా నిగావున్న ఏ ఆయుధాన్నైనా అంతర్జాతీయ కంట్రోలు కిందకి తెచ్చేందుకు సిద్ధంగా ఉన్నారా అని నేను అతణ్ణి సవాలు చేస్తున్నాను.

## మార్షల్ పథకం

మార్షల్ పథకం (యూరపుకు అమెరికన్ సహాయాగ్రం) విషయమై పారిస్‌లో సమావేశమైన వివిధరాజ్యాల విషయమై విషిన్స్కీ తీవ్రంగా విమర్శించాడు. కాని అక్కడ సమావేశమైన 16 రాజ్యాల్లోనూ ప్రతి ఒక్కటీకూడా తన ఇష్టాన్ని బట్టే సమావేశంలో పాల్గొన్నది. ఆ విషయమై రాజకీయ దృష్ట్యా ఏవిధమైన శాసనములను పరిగణించలేను."

మెక్నీల్ 75 నిమిషాలసేపు ప్రసంగించాడు. సభ్యులు దానిని ఆమోదిస్తూ కోలాహలం చేశారు.

సమావేశాన్ని తరవాతకు వాయిదా వేశారు.

మెక్నీల్ ప్రసంగం చాల బాగావున్నదనీ, అంతర్జాతీయ సహకార విషయంలో దీనివల్ల మంచి మార్పులు రావచ్చుననీ సమావేశానికి వచ్చిన ఒక ఇండియా ప్రతినిధి అన్నాడు. ప్రతినిధివర్గ నాయకురాలు శ్రీమతి విజయలక్ష్మి "వ్యాఖ్యానించేందుకు ఏమీలేదు" అన్నది.

# ఈజిప్టులో బ్రిటిష్‌సేనల ఉనికి

## హసన్‌పాషాకు మెక్‌నీల్ జవాబు

ఫ్లషింగ్ మెడోస్ (న్యూయార్క్) సెప్టెంబర్ 22: ఈజిప్షన్ ప్రజల ప్రభుత్వం అనుమతిలేకుండా 65 సం॥ల నుంచీ బ్రిటిషు సైన్యాలు ఈజిప్టులో వున్నవని ఈజిప్టు ప్రతినిధి హసన్‌పాషా ఐక్యరాజ్య సమితి సమావేశంలో చేసిన ఆరోపణకు బ్రిటిషు దేశీయశాఖామంత్రి హెక్టర్ మెక్‌నీల్ ఈవిధంగా జవాబు ఇచ్చాడు: 1914 ప్రపంచ యుద్ధ సమయంలోనూ, మొన్నటియుద్ధంలోనూ బ్రిటిషు సైన్యాల ఉనికి ఈజిప్టు ప్రజలకు అనిష్టంగాలేదు ఆ సేన రక్తాన్ని ధారపోసి వారు జర్మనులను వెనక్కి తరిమినప్పుడు ఏవిధమైన అనిష్టమూ కనిపించలేదు. ఈజిప్టు ప్రధాని నొక్రాషీపాషా 1936 ఆంగ్లో ఈజిప్షన్ సంధిని ఏ విధంగా బలపరిచాడో తెలుసుకుంటే, ఈజిప్టు ప్రతినిధి ఇంత కృతఘ్నతతో ప్రవర్తించటం భావ్యంకాదని విశదమవుతుంది" అని అతడు అన్నాడు.

## దేశంలో ప్రదర్శనాలు

అలెగ్జాండ్రియా, సెప్టెంబర్ 22: ఈవేళ మధ్యాహ్నం తెలంగాడి ఈజిప్టు ప్రజలు బ్రిటిషు వ్యతిరేక ప్రదర్శనాలు జరిపి, అలెగ్జాండ్రియాలోని బ్రిటిషు కాన్సల్ జనరల్ కార్యాలయంమీదా, ఇతర బ్రిటిషు భవనాలమీద రాళ్లు రువ్వి, కిటికీ తలుపులను ధ్వంసంచేశారు. పోలీసులు వీరిని అరికట్టేందుకు ప్రయత్నించటంలో ఒకపోలీసూ, పదిమంది ప్రజలూ గాయపడ్డారు.

## ఢిల్లీపరిస్థితులు

న్యూఢిల్లీ, సెప్టెంబరు 22: ఈ రోజు పహార్‌గంజ్‌లో ఆయాపాడుపెట్టిన ఇండ్లను పోలీసువారు సోదా చూస్తూ ఉండగా రెండుదేశవాళీ పిస్తోలులున్నూ, స్టెంగన్ కాయచిప్పలతో చేసిన నాల్గు బాంబులున్నూ, ఒకకత్తి కర్రయున్నూ రెండుకత్తులున్నూ దొరికినవి.

ఈ రోజు మధ్యాహ్నము ఒంటిగంట వరకున్నూ ఢిల్లీలో రెండు సంఘటనలే సంభవించినట్లుగా తెలుస్తూ ఉన్నది. పహార్‌గంజ్ ప్రాంతములో ఒకరిని దుండగులు బాకుతో పొడిచినారు. చాందినీబజారులో దారినపోతూ ఉన్న వారిమీద ఆ ప్రాంతాలలో ఉన్నవారు రాళ్లు రువ్వినారు. ఆ బాటసారులకు గాయాలు అయినవి. చికిత్సకోసము వారిని ఆసుపత్రికి పంపడము అయింది.

మధ్యాహ్నము ఒంటిగంట దాటిన తరువాత నగరములో ఆయా భాగాలలో బాకులతో పోట్లాటలు సాగినవి. చాంద్ని చౌకులోనూ, ఖారీబావిలోనూ దుకాణాలను దోచివేయడానికి ప్రయత్నముచేస్తూ ఉండగా పదిమందిని అరెస్టుచేసినారు. ఢిల్లీలో కొన్ని ప్రదేశాలలో అయిదుపదుకానీ అంతకన్నా ఎక్కువమంది కానీ గుమికూడ రాదని ఢిల్లీ జిల్లా మేజిస్ట్రేటు ఉత్తరువులు చేసినారు. మరికొన్ని ప్రదేశాలలో మిలటరి దుస్తులమాదిరి యూనిఫారములతో ఎవరున్నూ వీధులవెంట ఊరేగింపు సాగరాదనిన్నీ ఉత్తరువులు జారీచేసినారు. ఈ రెండు ఉత్తరువులున్నూ రెండుమాసాలు అమలులో ఉండునని ప్రకటించినారు.

## ఢిల్లీ కాందిశీక శిబిరంలో అమృతసర్ స్త్రీ

న్యూఢిల్లీ, సెప్టెంబరు 22: అమృతసరు నుంచి లేవతీసుకొని వచ్చిన ఒక యువతిని నిన్నటి దినము ఢిల్లీలో నిజాముద్దీన ప్రాంతాల ఉన్న కాందిశీకుల శిబిరములో మధ్యాహ్నమప్పుడు పోలీసులు గుర్తుపట్టినారు. పోలీసులున్నూ మిలిటరివారున్నూ అక్కడికి వచ్చినప్పుడు అక్కడ కొంత ఉద్రేకము చెలరేగింది. అందుకుగాను ఆ ప్రాంతముచుట్టూ, పోలీసులు పహారా ఉండిపోయినారు. ఇప్పుడు ఆ యువతి పోలీసు రక్షణములో ఉంది. ఈ విషయము పోలీసువారు ఇప్పుడు దర్యాప్తు చేస్తున్నారు.

# సభలు - సమావేశాలు

కృష్ణాజిల్లా యువజన కాంగ్రెస్ కార్యవర్గ సమావేశం యీనెల 26న ఆంధ్రరాష్ట్ర యువజన కాంగ్రెసుసంఘ కార్యాలయం బెజవాడలో జరుగును.

తూర్పు కృష్ణాజిల్లా కాంగ్రెసు కార్యవర్గ సమావేశం ఈనెల 24న జిల్లా కాంగ్రెసుసంఘ కార్యాలయం, బందరులో జరుగును.

తూర్పుకృష్ణాజిల్లా కాంగ్రెస్, రైతు కాంగ్రెస్ వర్కర్ల సమావేశం యీనెల 24న బందరు టౌనుహాలులో జరుగును. శ్రీ గుగ్గిరాల బలరామకృష్ణయ్యగారు అధ్యక్షత వహింతురు.

కృష్ణాజిల్లా రైతుసంఘ కార్యవర్గ సమావేశం యీనెల 27న జిల్లా రైతుసంఘ కార్యాలయం బెజవాడలో జరుగును

తెనాలి తాలూకా అమృతలూరు ఫిర్కా ప్రథమ రజకజన మహాసభ యీనెల 27న అమృతలూరులో జరుగును.

## అఖిలభారత మహిళాసభ

గుంటూరు, సెప్టెంబరు 18: 20వ అఖిలభారత మహిళామహాసభ యీసంవత్సరము డిసెంబరు చివరివారంలో చెన్నపట్నంలో జరుగును. శ్రీమతి అనసూయాబాయి కాలేగారు అధ్యక్షత వహింతురు. 18వ ఆంధ్రరాష్ట్ర మహిళామహాసభ నవంబరులో బెజవాడలో జరుగును. కాబట్టి అక్టోబరు మొదటివారంలోగా ఆంధ్రరాష్ట్ర మహిళాసంఘమునకు చెందిన జిల్లా సంఘములు, తాలూకా సంఘములు సభలు జరిపి, తీర్మానములుచేసి, ప్రతినిధులను ఎన్నుకొని వార్షిక నివేదికలను అందచేయవలసిందిగా ఆంధ్రరాష్ట్ర మహిళాసంఘ ప్రధాన కార్యదర్శిని శ్రీమతి కొండపార్వతీ దేవిగారు వ్రాయుచున్నారు.













# గవర్నమెంట్ ఆఫ్ ఇండియా డిస్పోజల్సు

"ఆకర్షణీయమైన స్టోరులు."

బహిరంగముగా టెండర్లు తెరచుటమూలముగా ఎక్కువ పాటపెట్టినవారికి వెంటనే అమ్మకమునకు.

1. 2060 గాలనుల డోప్ అల్యూమినియం. 312 ఎం. యు. ఆర్. ఎ. ఎఫ్. కొచ్చిన్ వద్ద వున్నది. రిజర్వు ధర పూర్తి లాటుకు రు 2060/- పూర్తి లాటుకు మాత్రమే పాటపెట్టవలెను.
2. 56 డిస్పర్సివ్ రిఫ్లెక్టర్లు 14" 3/4" యి. టి. లో ఇ. ఎస్. లాంప్ హోల్డరుతో, కొచ్చిన్‌లోని గారిజన్ ఇంజనీర్సు డంపువద్ద నున్నది. పూర్తి లాటుకు రిజర్వు ధర రు 420/-లు. పూర్తిలాటుకు మాత్రమే పాటపెట్టవలెను.
3. 5 గాలనుల ఫార్మల్ డిహైడ్ డ్రమ్ములు 160 (డిజిన్ ఫెక్టెంటు) 312 ఎం. యు. ఆర్. ఎ. ఎఫ్., కొచ్చిన్‌వద్ద వున్నది. పూర్తిలాటుకు రిజర్వు ధర 1850/-లు. పూర్తిలాటుకు మాత్రమే పాటపెట్టవలెను.
4. (a) 255 గాలనుల సాల్యుబుల్ ఆయిల్, (b) 12 గాలనుల గన్ క్లీనింగు ఆయిల్. ఈ రెండు 312 ఎం. యు. ఆర్. ఎ. ఎఫ్., కొచ్చిన్‌వద్ద వున్నవి. రిజర్వు ధర లేదు. పూర్తిలాటుకు మాత్రము పాటపెట్టవలెను.
5. 118 పౌండ్ల సాఫ్టు బ్రాస్, 312 ఎం. యు. ఆర్. ఎ. ఎఫ్., కొచ్చిన్‌వద్ద వున్నవి. పూర్తిలాటుకు రిజర్వు ధర రు 100/-లు. పూర్తిలాటుకు మాత్రమే పాటపెట్టవలెను.
6. 2 బ్రిటానియా ఎలక్ట్రిక్ పాలిషింగు మెషినులు. ½ హెచ్. పి. 440/3/50 ఎ. సి. తిరుచిరాపల్లి, గోల్డెన్‌రాక్‌లోని ఎస్. ఐ. ఆర్. వర్కుషాపులలో వున్నవి. పూర్తిలాటుకు రిజర్వు ధర రు 200/-లు. పూర్తిలాటుకు మాత్రమే పాటపెట్టవలెను.
7. 18,600 పౌనుల ఫెర్రస్ సల్ఫేటు, బెంగుళూరు కబ్బన్ రోడ్డులోని స్టేషన్ సప్లయి డిపోవద్ద వున్నది. పూర్తిలాటుకు రిజర్వుధర రు. 1148/12. పూర్తిలాటుకు మాత్రమే పాటపెట్టవలెను.
8. 2 హెచ్. పి. వర్టికల్ బాయిలర్ కలిగి వున్న ఒక డిసిన్ఫెక్టరు. 200 గాలను స్టీం ఛాంబరు, ఛానిస్-ఆన్-వీల్సును అమర్చబడినది. కోయంబత్తూరులోని ఇండియన్ స్టేషన్ వర్కుషాపువద్ద నున్నది. రిజర్వుధర రు. 1,000/-
9. హాండ్ వీల్ బేలింగ్ ప్రెస్ .1 మద్రాసులోని ఆర్డినెన్సు క్లోదింగ్ ఫ్యాక్టరీవద్దగలదు. రిజర్వుధర రు 481/-
10. 11,000 నం॥ల ఫ్లయిఫుడ్-3 ప్లై × 5 ఎం. ఎం. × 4 అ॥ × 4 అ॥ ఆర్కోణంలోని ఇంజనీర్ పార్కువద్ద వున్నది. రిజర్వుధర రు. 687/8- పూర్తిలాటుకు మాత్రమే పాటపెట్టవలెను.
11. (a) 61 గాలనుల ఆంటి-ఫౌలింగు (గ్రే) పెయింటు రెండు 40 గాలనుల డ్రమ్ముల (బారల్సు)లో ప్యాకింగు చేయబడినది.

(b) 259 గాలనుల ఆంటి - ఫౌలింగు (బ్లాక్) పెయింటు. వీటు 400 గాలనుల డ్రమ్ముల (బారల్సు)లో ప్యాకింగు చేయబడినవి, ఆవడిలోని 602 ట్రాన్స్‌పోర్టేషన్ స్టోర్ డిపోవద్ద నున్నవి. పూర్తిలాటుకు రిజర్వుధర రు 640/-లు పూర్తిలాటుకు మాత్రమే పాట పెట్టవలెను.

1947-వ సం॥ అక్టోబరు 6-వ తేదీలోగా రీజియనల్ కమిషనర్ (డిస్పోజల్సు) మద్రాసు వారికి, చేరే రిజర్వు యూనిట్ ధరకు హెచ్చుపాట అంగీకరించబడును. రిజర్వు ధరకన్న తక్కువ ఆఫర్లు పంపవద్దు. గెలిచిన టెండరుదారుకు తెలియబరచబడును.

గెలువని టెండరుదారుల డిపాజిట్లు 1947-వ సం॥ అక్టోబరు 14-వ తేదీలోగా వాపసు చేయబడును. 1947-వ సం॥ అక్టోబరు 7-వ తేదీ ఉదయము 11 గంటలకు టెండర్లు మద్రాసు, ఎస్ప్లనేడ్, యునైటెడ్ ఇండియా లైఫ్ బిల్డింగులోని రీజియనల్ కమిషనర్ (డిస్పోజల్సు) వారి ఆఫీసులో బహిరంగముగా తెరువబడును. స్టోరులు 1947-వ సం॥ అక్టోబరు 28-వ తేదిలోగా తీసుకొనిపోవలెను. అవి "ఎక్కడ నున్నవి అక్కడ వున్నట్లుగా" అమ్మబడును.

సాదా కాగితముమీద సీల్డు టెండర్లు డబుల్ కవర్లలో "Attractive Selections" అని సూపర్ స్క్రైబ్ చేసి పంపవలెను. ప్రత్యేక ఫారములు అవసరములేదు. రిజర్వు బ్యాంకులో గాని, ఇంపీరియల్ బ్యాంకులోగాని, ఇండియా గవర్నమెంటు ట్రెజరీలోగాని మద్రాసు, రీజియనల్ కమిషనర్ (డిస్పోజల్సు) వారి పేర పాట సొమ్ములో 10% డిపాజిట్టుగా కట్టి సదరు రసీదులో పంపని ఏ టెండరున్ను అంగీకరింపబడదు. చెక్కులు అంగీకరింపబడవు. స్టోర్లు చూడుటకు, మద్రాసు, ఎస్ప్లనేడ్ లోని యునైటెడ్ ఇండియా లైఫ్ బిల్డింగునందలి డిస్పోజలు ఆఫీసునుండి పర్మిట్లు పొందవచ్చును.

నోటు. 1. ఈ ఆఫీసునుండి ఈ స్టోరుల నుగురించి తెలియగల ఇతర ఇన్‌ఫర్మేషన్ ఏమియును లేదు.
2. రీజియనల్ కమిషనర్ (డిస్పోజల్సు) మద్రాసువారు, పైలిస్టులో ఏ అయిటములనైనా లేక అన్ని అయిటములనైనా కారణములు తెలుపవక్కరలేకయే ఉపసంహరించవచ్చును.

# గవర్నమెంటు ఆఫ్ ఇండియా

## డిస్పోజల్సు

### టెండరు నోటీసు

### ఎలెక్ట్రిక్ కేబిల్సు

మద్రాసు, ఆవడి, 206 బేస్ ఆర్డినెన్సు డిపో వద్దనున్న ఈ క్రింది స్టోర్సు కొని, తీసికొనిపోవుటకు సీలు వేయబడిన టెండరులు కోరబడుచున్నవి.

| స్టోర్లు. | మొత్తము. | |
|---|---|---|
| 1. ఎలెక్ట్రిక్ కేబిల్ 'J' సింగిల్‌లో 0 04 | 300 | గజములు. |
| 2. ఎలెక్ట్రిక్ కార్డ్స 5 కార్డ్స 0 0006 టేప్డు B బ్రెయిడెడ్ అండ్ కాంపౌండ్ | 4912 | ,, |
| 3. ఎలెక్ట్రిక్ కేబిల్ 'J' సింగిల్ మీడియం 0 1 | 3180 | ,, |
| 4. ఎలెక్ట్రిక్ కేబిల్ 3 కార్డ్స 'N' సర్క్యులర్‌లో 0.0225 | 703 | ,, |
| 5. ఎలెక్ట్రిక్ కేబిల్ 'K' సింగిల్‌లో 0 002 | 3260 | ,, |

టెండరుపైన వ్రాయవలసినది. : టెండరు నెం. RCM/C82/431

చేరవలసిన ఆఖరు తేది. : 8-10-47 తేది సాయంత్రం 4 గంటలకు

అంగీకారమునకు ఆఫరులు తెరువబడియుండు చివరి తేదీ:- 7-11-47.

ధరావతు సొమ్ము: టెండరు చేయబడిన మొత్తపు సొమ్ములో 10% తక్కువ కాకుండ ఇంపీరియల్ బ్యాంకు లేక రిజర్వు బ్యాంకు లేక ప్రభుత్వ ఖజానాలో మద్రాసులోని రీజియనల్ కమీషనర్ (డిస్పోజల్సు) వారిపేర డిపాజిటుచేసి, సదరు చలానా లేదా రసీదును టెండరుతో జతపరచి పంపవలెను.

Con 117 ఫారములోని షరతుల ననుసరించి అమ్మకములు జరుగును. సదరు ఫారము, మద్రాసులోని రీజియనల్ కమీషనరు (డిస్పోజల్సు) గారి ఆఫీసులో చూడవచ్చును. Con 117 ఫారంలోని షరతుల నామోదించుచున్నామని టెండరు దారు టెండరులో విస్పష్టముగ తెలుపవలయును.

రెండు టెండరు ఫారములు గల సెట్టు 1-కి 5 రూపాయలవంతున నగదుగా గాని, మనియార్డరు ద్వారా గాని మద్రాసులోని రీజియనల్ కమీషనరు (డిస్పోజల్సు) వారికి చెల్లించి ఖాళీ టెండరు ఫారములను బడయవచ్చును. టెండరు రుసుము వాపసు చేయబడదు. టెండరు ఫారము, ఒకరిది మరియొకరికి మార్చుకొనగూడదు.

రీజియనల్ కమీషనరు (డిస్పోజల్సు) యునైటెడ్ ఇండియా లైఫ్ బిల్డింగు, ఎస్ప్లనేడ్, మద్రాసువారి చిరునామాకు డబుల్ సీలు వేసిన కవర్లలో టెండరులు పంపబడవలెను. టెండరు పూర్తిగగాని, కొంతభాగముగాని, వారి యిష్టానుసారము కేటాయించు నధికారము వారికి గలదు. అట్లు వారుచేయు కేటాయింపు ఖాయమయినదిగా వుండును.

టెండర్లు అవి ముగించిన మరుసటిరోజు ఉదయం 11 గంటలకు టెండరుదారుల సముఖమున విజిటర్సు రూములో తెరవబడును.

డెలివరీ సదరు స్థలమువద్దనే యివ్వబడును. ఆఫరు అంగీకరింపబడిన 15 రోజులలోపుగ స్టోర్లను తీసికొనిపోవుట పూర్తికావలెను.

మద్రాసులోని రీజియనల్ కమీషనర్ (డిస్పోజల్సు) గారికి దరఖాస్తు చేసి స్టోర్లను ముందుగా తనిఖీ చేసుకొనుటకు అనుమతి పత్రములను పొందవచ్చును.

**రీజియనల్ కమీషనర్ (డిస్పోజల్సు) సదరన్ సర్కిల్**

యునైటెడ్ ఇండియా లైఫ్ బిల్డింగ్, ఎస్ప్లనేడ్, మదరాసు.

# దేవాలయాల, ధర్మసంస్థల ఈనాములు

## జమీందారీ బిల్లునుంచి మినహాయింపుచేసే అభిప్రాయం

చెన్నపట్నం, సెప్టెంబరు 23: మద్రాసు, శాసనసభల కాంగ్రెస్ పక్షసమావేశం నిన్న బాంక్వెటింగ్ హాలులో జరిగినపుడు జమీందారీ బిల్లుపై చర్చ జరిగెను. శ్రీ పిఠాపురం యువరాజా గారు జమీందారులకు ఇప్పుడు ఇచ్చేదమన్న పరిహారము పరిహారమనుటకు వీలులేదనియు, మరికొంత ఔదార్యము చూపవలెననియు తెలిపికొన్ని సవరణలకు నోటీసునిచ్చిరి. పర్చ్యరలో తర్వాత నిర్ణయములు చేయుట ఉత్తమమనిరి.

శ్రీ. భాష్యం, కె. నటరాజన్ గారలు ఈనాముల నీబిల్లునుంచి మినహాయించవలెననియు, కనీసము, దేవాలయాల క్రింద, ధర్మసంస్థలక్రింద ఉన్నా ఈనాముల బిల్లు వర్తించరాదనిరి.

ఎస్. ఎస్. భరదాచారిగారు తీర్మానముల రూపకముగా నిబంధనల ప్రతిపాదించి ఓటింగు తీసుకొనుట కర్తవ్యమనిరి. వచ్చే వారం నాటికి మరల చర్చ వాయిదా వేయబడెను.

తమిళ సభ్యులపట్ల ఎక్కువగానున్నందున దేవాలయములు, ధర్మ సంస్థల క్రింద ఈనాములకీ బిల్లు వర్తించకుండా మినహాయింప నిచ్చెదరనియు, ఈ ప్రకారము 6 మొదలు 8 లక్షల వరకూ ఈనాములీ బిల్లు క్రింద రావనియు తెలియుచున్నది.

## 'ధాన్యంధర పెంచవలెను'

శ్రీ అడుసుమిల్లి గోపాలకృష్ణయ్య ఎం. ఎల్. సి. గారు బియ్యంలోని విధి నిషేధాలను రద్దుచేసినచో ధాన్యంధర మణుక్కు 14 అణాలు పెంచవచ్చుననియు, దీనికి భారత ప్రభుత్వమువారు అభ్యంతరము పెట్టుటకు వీలులేదనియు మద్రాసు ప్రభుత్వము వారికి ఒక విజ్ఞప్తినిచ్చిరి ఇందువల్ల వచ్చేపంట 100 కి 5 వంతులు పెరగగలదనియు, మేలురకం పంటకన్న మామూలు రకం ధాన్యం హెచ్చుఉత్పత్తి గాగలదనియు వారు తెలిపిరి. బియ్యం రవాణా, పంపకం ఖర్చు ప్రభుత్వమే భరించిన ధాన్యంధర మణుక్కు రు. 8/- పెట్టవచ్చునని, ఉత్పత్తిదారుల ఆందోళన కొంత తీరగలదనియు గూడా తెలిపిరి. చెన్నరాష్ట్రం జనాభా భారతదేశములో ఎనిమిదింట ఒకపాలు ఉన్నదనియు. ధాన్యంధరకు ఒక ప్రమాణమును నియమించి, మామూలు వ్యాపారమును స్వాయము జరుగునట్లు చూడవలెననియు, ధాన్యానికి రాష్ట్రమును స్వయంపోషకము చెయ్యవలెననియు, ఎరువులను హెచ్చు ఉత్పత్తిచేసి ప్రభుత్వము సరఫరా చెయ్యవలెననియు సూచించిరి.

## గుఱ్ఱప్పందెములపన్ను

మద్రాసు మంత్రివర్గం సమావేశం ఆదివారం జరిగినపుడు, గుర్రపుపందెములపన్ను యీసంవత్సరం నూటికి 6¼ నుండి 6¾ వరకు పెంచుటకు నిర్ణయించిరి. దీనివల్ల యీయేడు రూ 25 లక్షలు రాబడిరాగలదు.

బొంబాయిలోవలె చన్నరాష్ట్రంలో గూడ "హోంగార్డు" దళమును స్థాపించుటకు మంత్రివర్గంవారు నిశ్చయించిరి. అందు చేరుట బలవంతంకాదు.

వస్తువిక్రయం పన్ను రూ 100 లకు రూ 1 కిబదులు రూ 1-9-0 వసూలుచేయుటకు మంత్రివర్గంవారు నిశ్చయించిరి. దీనివల్ల సాలీనా రూ 3½ కోట్లు అదనంగా రాబడిరాగలదు. చిల్లరవర్తకంలో రూ 1కి 0-0-3 వసూలుచేయబడును.

### కీ॥ శే॥ చావా రామానాయుడు గారు

తెనాలి, సెప్టెంబరు 14. సుప్రసిద్ధ కాంగ్రెసువాది, నిత్యమూ ఖద్దరు పరిశ్రమ చేయువారు, స్థానిక నేషనల్ క్లబ్బు కార్యదర్శి శ్రీ చావా రామానాయుడుగారు క్షయవ్యాధిచే మరణించిరని వ్రాయుటకు విచారించుచున్నాను.

స్వ. వి.

### కీ॥ శే॥ వాగు కామరాజుగారు

ఏలేశ్వరం, సెప్టెంబరు 15: గత పది సంవత్సరములనుండి కాంగ్రెసు సంఘ సభ్యులుగానుండి దేశసేవ చేయుటలోనే ఎక్కువగా తమ జీవితమును గడపిన శ్రీ వాగు కామరాజుగారు మొన్న స్వర్గస్థులైరి చనిపోవునప్పటికి వీరి వయస్సు 32 సం. మాత్రమే. వీరు 1941 లో గాంధీగారి ఆదేశానుసారం సత్యాగ్రహంచేసి జైలుకు వెళ్లినారు.

స్వ. వి.

### కీ॥ శే॥ శ్రీ మట్టా గురుమూర్తి గారు

విశాఖపట్టణం, సెప్టెంబరు 16: ఈ పట్టణములోనున్న ఎస్. ఎస్. ఎం ప్రెస్ యజమాని శ్రీ మట్టా గురుమూర్తి గారు మొన్న స్వర్గస్థులైరి. సంతాప సూచకంగా స్థానికప్రెస్సులు అన్నీ మూసి వేయబడినవి.

# యూనివర్సిటీ హాస్టల్ విద్యార్థుల తొలగింపు

## అధికారులకు శ్రీ విశ్వనాథంగారి విన్నపం

చెన్నపట్నం, సెప్టెంబరు 22: 1947 జూలై 25వ తేదీన సిండికేటు మీటింగు నిమిత్తము బందరుకాలేజి ప్రిన్సిపాల్ గారు వచ్చినపుడు ఆయన్ని కొట్టబోయారనే నేరంపైని పదిమంది విద్యార్థులను ఆంధ్ర యూనివర్సిటీ హాస్టలునుండి పడగొట్టారని తెలుస్తోంది. ఈ విషయమై ఎంక్వయిరీగూడా చేసినట్లు ఇదివరలో విన్నాం. కాని ఆ ఎంక్వయిరీ రిపోర్టు ప్రచురింపబడలేదు. యూనివర్సిటీ వ్యవహారాలతో ఇతరులకు సంబంధం లేదనే టువంటి అపోహ యూనివర్సిటీ అధికారుల మనస్సులో ఉన్నట్టు కనిపిస్తోంది. శిక్షణకులోబడి విద్యార్థులు ఉండవలసిందని వప్పుకోవడానికి ఎవరికీ సందేహంలేదు కాని ఏదైనా విషయం వచ్చినప్పుడు చేసిన నేరానికి శిక్ష తగినంత ఉన్నదా హెచ్చుగా ఉన్నదా అనే సంశయం వున్నా ఒక్కమారుగా పదిమంది విద్యార్థులను శిక్షించారు. అనేటటువంటి సంగతిన్నీ ఇది కేవలం యూనివర్సిటీ అధికారులకే కాక సాధారణ పౌరసంబంధమైన సమస్యలుగా కూడా కనిపిస్తాయి ఇంతకూ డిమాన్స్ట్రేషన్ చెయ్యడం అనేది కాలేజీ స్థానంలో జరగలేదు. హాస్టల్ గదుల్లో జరగలేదు. కాలేజిలో జరుగుచున్న పాఠముల క్రమానికి ఏమాత్రమూ ఏమిన్నీ భంగం కలగలేదు. సిండికేట్ మీటింగుకు భంగం కలగలేదు అని అందరూ చెబుతున్నారు. విచారణ సంఘంవారు తేల్చడానికి వచ్చారో తెలియదు. శ్రీ శివరామ కృష్ణారావుగారు చిరకాల మిత్రులూ పూజనీయులూ. వారిపైని విద్యార్థులు దౌర్జన్యం చెయ్య వచ్చారంటే నేనేమాత్రం హర్షించేవాణ్ణి కాను. అయినప్పటికీ వందల కొద్ది విద్యార్థులు ఏదో కారణంపైన ఆయనే వారందరికీ అపకారం చేసినట్లు ఒక ఊహ కలిగి ఏకంగా సిండికేట్ మీటింగులో ఉన్న అధికారులకు చెప్పుకునేందుకు వారు వచ్చినప్పుడు శ్రీ శివరామ కృష్ణారావుగారు వారికి కంటబడితే కొంత ఉద్రేకం కల్గినమాట వాస్తవం. ఒకరిద్దరు దురహంకారంగా మితిమీరిన ప్రవర్తన చేసి కూడా ఉండవచ్చు. కాని పదిమందిని ఒక్కమారుగా వెడల గొట్టడం అన్నది వారు చేసిన నేరానికి మించినటువంటి శిక్ష. అధికారులు వారిని తిరిగి ఆలోచించి హాస్టల్లోకి తీసుకొందురు గాక అని ఆశిస్తున్నాను.

మద్యనిషేధప్రచారకులుగా కాంగ్రెసు సేవకులను ప్రభుత్వంవారు నియమించటానికి నిర్ణయించినట్టు తెలుస్తోంది.

# ప్రపంచదేశాలతో పత్తివ్యాపారం

సూరత్, సెప్టెంబరు 21: ప్రపంచ దేశాలతో ఇండియా ప్రత్తి వాణిజ్యం, యికమీదట ఒకేముఖంగా నడపడం పనికిరాదు. ఇచ్చి పుచ్చుకొనే ప్రాతిపదిక మీద, ఇండియా అంతర్జాతీయ వాణిజ్య విధానంతో ప్రత్తి వాణిజ్యాన్ని కూడా ఇముడ్చాలి" అని కరాచీ ప్రత్తి వాణిజ్య సంఘ కార్యదర్శి టి వి. దలాల్ చెల్లించాడు. బ్రిటను, ఫ్రాన్సు, స్పెయిను, ఇటలీ, స్విట్జర్లాండు, బెల్జియం దేశాలలో విస్తృతంగా పర్యటనచేసి ఆయాదేశాలలోని ఆర్థిక రాజకీయ పరిస్థితులను సమగ్రంగా అవగాహన చేసుకొని యీవారమే దలాల్ ఇండియాకు వచ్చాడు. విదేశాలలో ఇండియా ప్రత్తి వాణిజ్యం బాగా అభివృద్ధి అయ్యే అవకాశాలు ఎక్కువగా ఉన్నాయని, మళ్లీ యుద్ధపూర్వస్థాయిని మన ప్రత్తి వాణిజ్యం అందుకోగలదని దలాల్ అన్నాడు

విదేశాలతో ఇండియా వాణిజ్యాన్ని, అభివృద్ధిచేయడానికి ముఖ్యంగా ప్రత్తి వాణిజ్య పరిస్థితి బాగుపర్చడానికి, యేదైనా చేసేముందుగా, ఉభయ అధినివేశాలు నిర్మాణాత్మకమైన కృషికి పూనుకోవడం ఆవశ్యకం.

"ఐరోపా రాజ్యాలలోను, బ్రిటన్ లోనూ ఆర్థిక పరిస్థితి చాలా ఇబ్బందిగా ఉన్నది ఐరోపా రాజ్యాలన్నీ మార్షల్ ప్రణాళిక ఎప్పుడు అమలులోకి వస్తుందా అని ఎదురుచూస్తున్నాయి. ప్రపంచంతా తన అండను ఉంచినందుచేత, యీ ఆర్థికచిక్కులనుండి బ్రిటిషు ప్రభుత్వం బయటపడవచ్చు ఐరోపాదేశాలన్నీ మళ్లీ నిలదొక్కుకొని యుద్ధపూర్వపు స్థాయికి వచ్చాయంటే, అంతర్జాతీయ వాణిజ్యంలో, ఇండియా, పాకిస్తాన్‌లు వాటితో పోటీలను చేయడం దుర్లభమౌతుంది కాబట్టి ఉభయ అధినివేశాలు, యిక నిర్మాణాత్మక కృషికి పూనుకోవాలి రెండు మూడు సంవత్సరాలలో మన స్థితిని మనం చక్కబరచుకోకపోయినట్లైతే, అంతర్జాతీయ వాణిజ్యంలో మనం నామరూపాలు లేకుండపోతాం" అని దలాల్ హెచ్చరించాడు.

# మద్యనిషేధానికి ఇదే తగినసమయం

## హరిజన్‌లో గాంధిజీ

అహమ్మదాబాద్, సెప్టెంబరు 21: 'మత్తుపదార్థాల నిషేధం అన్న శీర్షికతో నేటిహరిజన్‌లో గాంధీజీ ఇల్లా వ్రాశారు.

"నేడు ప్రజాప్రభుత్వం అధికారంలో ఉన్నది. ఈ ముఖ్య సంస్కారాన్ని అమలుజరపడానికి ఇదే తగిన సమయం. దేశంలో బట్టలకొరతా అన్నవస్త్రాలులేక అల్లాడుతున్నప్పుడు మత్తుపదార్థాల్లో నిమగ్నులై ఉండడానికి ఎవరు సాహసిస్తారు. వీటికయ్యే ఖర్చు కేవలం బూడిదలోపోసిన పన్నీరు కావడమే కాక ప్రజలకు ఆత్మనిగ్రహంకూడా లేకుండాచేస్తుంది కల్లుతాగి కండకావరం లోక్కవాడు తెలిసి ఉన్నప్పుడు తాను చెయ్యలేని ఘోరకృత్యాలను కూడా చేసివేస్తాడు. ఈ విధంగా చూస్తే ఎలా ఆలోచించినా మద్యనిషేధం ఆవశ్యకర్తవ్యం.

ఊరకే చట్టాలు చేసినందువల్ల గురభ్యాసాన్ని నిర్మూలించలేము. దొంగ వ్యాపారం సాగుతూనే ఉంటుంది.

అందుకని సంస్కరణ శాసనంతో ఈ క్రింది సూచనలవలంబించాలని నా ఉద్దేశం.

(1) చట్టం అమలు పరచడం.

(2) ప్రజాభిప్రాయాన్ని సంస్కరించడం.

(3) కల్లు దుకాణాలుండే చోట హానిలేని ఇతర పానీయాలమ్మే కొట్లు పెట్టి ప్రచారక వార్తాపత్రికలను అందివ్వడం.

(4) ఇంతవరకూ మత్తుపదార్థాలు అమ్మినందువల్ల వచ్చిన ఆదాయాన్ని ప్రజాభిప్రాయం నిషేధానికి సుముఖమయ్యేటట్లు చెయ్యడానికి వినియోగించడం. ఆ ఆదాయాన్ని ఇతర కార్యాల కుపయోగించడం చాలా అన్యాయం.

## చీరాలలో ఆహార విషమస్థితి

చీరాల, సెప్టెంబరు 22: ఈవూరి రేషనింగ్ ప్రాంతంలోని బియ్యంకు కొరతాల లో 5 రోజులనుండి బియ్యంలేవు రేషన్ కార్డులున్న వారికి గతవారంలో 3 రోజుల రేషన్ మాత్రం ఇచ్చారు. ప్రజలు పస్తులుపడి ఉంటున్నారు ఇవ్వాళ వేదులు గుంపులు గుంపులుగా రేషన్ షాపులకు పోయి బియ్యం కోసం కాచుకు కూచున్నారు. రేషనింగ్ ఆఫీసుగారు వెంటనే సరఫరాలు ఏర్పాటుచేసేందుకు నిన్న గుంటూరు వెళ్లారు.

స్వ. వి.

## ఏజన్సీలో క్షామపరిస్థితులు

భద్రాచలం, సెప్టెంబరు 17: ఏజన్సీలో సగమునకుపైగా వర్షాలు లేక గతసంవత్సరం పంటపోయింది ఈ ఏజన్సీ ప్రాంతమంతా రాజమండ్రివగైరా యితర ప్రాంతాలనుండి వచ్చు ఆహారధాన్యముల పైనే ఆధారపడియున్నవి ఆహారపరిస్థితిని గురించి చర్చించుటకు శ్రీపాకల కృష్ణా రావుగారి అధ్యక్షతను నిన్న ఒక సభ రంగసభ జరిగెను అనేకులు ఉపన్యసించిరి.

ఏజన్సీప్రాంతంలో భూస్వాముల ధనికులకద్దనుండి సేకరించుటద్వారా వచ్చిన ధాన్యమును, రాజమండ్రినుండి వచ్చు ధాన్యమును, మొత్తమును కొత్తపంటలు వచ్చువరకు ప్రజలకు సరఫరాచేయించవలెనని ప్రభుత్వమును కోరుతూ తీర్మానించిరి ఇందుకుగాను శ్రీ ఎమ్మంగారి బలరామయ్యగారి నాయకత్వమున స్థానిక తాసిల్దారువద్దకు రాయబారము వెళ్లుటకు నిశ్చయింపబడినది

స్వ. వి.

### ఆంధ్ర విశ్వవిద్యాలయ అకాడెమిక్కు కవున్సిలు

ఆంధ్ర విశ్వవిద్యాలయ అకాడెమిక్కు కవున్సిలు సభ వాల్తేరులో 6-10-47 తేదీన ఉదయము 8-30 గం॥ సమావేశమగును. అకాడెమిక్కు కవున్సిలుకు విశ్వవిద్యాలయమునకు అనుబంధించబడిన కాలేజీల ఉపాధ్యాయులలో నుండి 15 మందిని అకాడెమిక్కు కవున్సిలు సభ్యులుగా యీ సమావేశములో హాజరగు అకాడెమిక్కు కవున్సిలు సభ్యులచే ఎన్నుకోబడెదరు.

# గవర్నమెంట్ ఆఫ్ ఇండియా

## డిపార్టుమెంట్ ఆఫ్ ఇండస్ట్రీస్ అండ్ సప్లయిస్, రీజియనల్ డిస్పోజల్సు కమిషనర్ ఆఫీసు,

మర్కంటైల్ ఛేంబర్సు, గ్రాహంరోడ్డు, బల్లార్డు ఎస్టేట్,

బొంబాయి.

బొంబాయిలోని రీజియనల్ కమిషనరు (డిస్పోజల్సు) యీ క్రింది స్టోరులను స్థలమువద్దగాని, తీసికొనిపోవుటకు సీల్డు టెండరుల కోరుచున్నారు.

| స్టోరుల వివరము. | మొత్తము. | ఏ పరిస్థితిలో నున్నది. |
|---|---|---|
| కార్బన్ H C. D. నెగటివ్ 16 ఎం. ఎం. dia ఎం. ఈ. 1 | 40,000 | ఉపయోగకరము - క్రొత్తది |
| కార్బన్ H. C. D పాజిటివ్ 16 ఎం. ఎం. dia ఎం. ఈ. 1 | 1,75,000 | ,, |
| కార్బన్ హారిజాంటల్ ఆర్క్ పాజిటివ్, 16ఎం ఎం dia ఎం. ఈ 1 | 20,000 | ,, |
| కార్బన్ H. C. D. నెగటివ్, పాజిటివ్, 16 ఎం. ఈ. 11 16 ఎం. ఎం. dia | 4,00,000 | ,, |
| కార్బన్ హారిజాంటల్ ఆర్క్ H. C. D. నెగటివ్, 16 ఎం. ఎం. dia ఎం. ఈ. 11 | 8,000 | ,, |

ఉన్న ప్రదేశము:- సెంట్రల్ ఆర్డినెన్సు డిపో, కండివిల్లి.

టెండరుపైన వ్రాయవలసినది నెం. RCS/80023/10/ECS.

చేరవలసిన ఆఖరు తేది: -15-10-47.

సెట్టు 1 కి రూ 5 చొప్పున చెల్లించి యీ ఆఫీసునుండి పొందబడిన (యీ సొమ్ము వాపసు కాబడదు) టెండరుపత్రములద్వారా ఆఫరులు దాఖలు కావలెను ఆ టెండరు కవర్లలోనుండి, లోని కవరుపై టెండరుయొక్క నంబరు, చేరవలసిన తేదీ పైన కలిగియుండి, సీలుచేయబడవలెను.

ఆఫరులయొక్క మొత్తము విలువలో 10% ధరావతు పైకమును (ఓడిన టెండరుదారులకు యిది వాపసుచేయబడును) రిజర్వుబ్యాంకు లేక ఇంపీరియల్ బ్యాంకు లేక యే ప్రభుత్వ ఖజానాలోగాని, 'సివిల్ డిపాజిట్సు' శీర్షిక క్రింద బొంబాయిలోని రీజియనల్ కమిషనర్ (డిస్పోజల్సు) వారిపేర డిపాజిట్టు చేయవలెను. అట్టి ఖజానా లేక బ్యాంకు రసీదుతో జతపరచబడని టెండరులు ఉపేక్షింపబడును.

చెక్కు లంగీకరింపబడవు

స్టోరులయొక్క మొత్తము, నాణ్యత, 'ఉపయోగము విషయమై పూచీ యీయబడదు. Con 117 పత్రములో నిబంధింపబడిన షరతుల ననుసరించి అమ్మకములు జరుగును.

స్టోరులను చూచుకొనుటకు అనుమతిపత్రములు ఆయా రీజియనల్ కమిషనరుల నుండి పొందవచ్చును. ఆఫరుచేయబడిన తేది నుండి 30 దినములవరకు ఆఫరులంగీకారమునకు తెరచియుంచబడును.

